## కవిరాజు.

ద్యాదరోత్పన్నతకీర్తిధాన్యధనసం
స్థానుండు గా భూపతిన్
శ్రీదాక్షాయణిప్రోచుఁ గాత మని యా
శీర్వాదముల్ జేయఁగన్.

మంగళతూర్య నాదము ల
మందగతి న్వినువీధి ముట్టె, వా
రాంగన లాడి పాడిరి, చి
రాయురుపేతుఁడు గా, యశోంగనో
త్సంగసుఖాసనప్రమద
సాంద్రుఁడుఁ గాఁ గనకాక్షత ల్సభా
రంగవిరాజమానుఁ డగు
రాజుశిరంబునఁ జల్లి రెల్లరున్.

అంత నవవేముఁ డత్యంతహర్ష మొంది
లలితకాశ్మీరపున్సాలువుల నొసంగి
సప్తశతరత్నములు స్వర్ణశస్త్రభాజ
నంబునం దుంచి యిచ్చె శ్రీనాథకవికి.

# కవిరాజు.

ప్రాంచితరీతిఁ బద్దెములు
పండితు లెల్ల పఠించి తేని దీ
వించుచుఁ గాన్కల న్గొనుట
వీక్షణముల్ బొనరించి బాఁపఁ డా
శించుచుఁ బారితోషికముఁ
జేరి నృపుం బఠియించెఁ దాను ని
ర్మించినగీత మిట్లు విప
రీతముగాఁ గరయుగ్మ మూఁపుచున్.

(భావగీతము.)

కొండమీద విన్న గూగూలు!
కొండక్రింద గన్న వాగూలు!
అప్పన్న చెవి నున్న పోగూలు!
అనవేమా రెడ్డియాగూలు!

పక్కన రెడ్డితేఁడు నగెఁ
బండితు లెల్లరు నవ్వి రంత న
ల్దిక్కుల హాసగర్జలు ప్ర
తిధ్వను లీనఁగ నయ్యెఁ బేదవాఁ

## కవిరాజు.

డొక్కుఁడె తెల్లవోయి సమ
యోచితబుద్ధివిహీనుఁ డౌచు నా
కెక్కుడికైత వచ్చె నను
చెంతయుఁ జింతిలుచున్నయంతలోన్.

"పాఱుఁడా! సిగ్గు లేదె నీపాడుకైత
నిట్టిసభలోన వచియింప నియ్యకొంట
కింతకన్న మఱేదేని హీనవృత్తి
ఘనము కా దేమొ యోచించుకొనుము నీవ!

ఉబుసుపో నట్టిమంగలి యోర్మిమీఱఁ
బిల్లితల గొఱిఁగె నఁట తద్విధము గాఁగ
నన్య మేమియుఁ దోఁపక యల్లినావొ
రోఁతఁ గలిగించునట్టినీకైత వెడఁగ!

ఘనతరులు రాల్చుపత్రార్ధకాండములను
కావు కా వని యార్చుచు నావనికొని
కూర్చి కాకవి రచియించుగూఁడువోలు
కైత యొకకొంత మిన్న నీకైతకన్న.

## కవిరాజు.

రసము నే నెఱుఁగనా, ప్రారబ్ధ మిది యేమి?
ద్రవిడదేశాన్నసత్రముల నిడరె?
సముచితాలంకారసమితి నే నెఱుఁగనా ?
మగువలు ధరియించునగలు గావె ?
యతిని నే నెఱుఁగనా, క్షితిలోనఁ గాషాయ
వస్త్రధారుం డైనవాఁడు గాఁడె ?
గురువు నే నెఱుఁగనా ? సరి సరి యక్షరా
భ్యాసనంబు సలిపినయతఁడు గాఁడె ?

శబ్ద మన నే నెఱుంగనా ? చప్పుడు గదె ?
యనుచు వచియించునజ్ఞానజనములోన
నగ్రగణ్యుండ వగునీ వహో ! కవిత్వ
మును రచించుట భాషకు ముప్పు గాదె?

కలుగుఁగా గంటము, తాటియాకులకు నే
కష్టంబుఁ గాన్పింప, దీ
యిలఁ గార్యాంతర మేది లే దనుచు నీ
యిష్టానుసారంబుగాఁ

## కవిరాజు.

గిలుకక జన్నె కవిత్వ మంచు నెదియో ?
గీర్వాణశుద్ధాంధ్రభా
షలముక్క నొ్కగ మైన నేరకయె, భా
షాద్రోహి ! భావింపుమా !

దున్న యీనిన దన దూడను గట్టుమం
చనెదునెద్దుమొద్దుజనపతి వలె
నన్ను నెంచినావా ? సన్నకసన్న నా
దృష్టిపథమునుండి తొలిగి పొమ్ము."

అను చాభూపుఁడు బాఁపనిం గినుకమై
నందుండి పో నాడఁ జ
య్యన శ్రీనాథుఁడు జాలిఁ బొంది కడునె
య్యం బొప్ప వాక్రుచ్చె "నో
జననాథా ! యొకమాట, యీకవిని నీ
చప్రాయునిం గాఁగ నీ
వనరా దీతఁడు గా కవీశ్వరుఁడు భా
వాతీతభావ్రుం డిలన్.

# కవిరాజు.

నిన్నటిముద్దుబాఁపఁ డెటు
    నేఁడు కవీశ్వరుఁ డంచు నెంచ, కా
ర్వ న్నరజన్మ లెల్లరుఁ గ
    విత్వగుణంబును గల్గువార, లో
యన్న ! కవీశు లన్న నొక
    యద్భుతమానవజాతి యేడనో
యున్న దటంచు నీవు మది
    నూహ యొనర్పకు మింక నెమ్మదిన్.

కవనగానవిచిత్రలేఖనములందు
నెందు నైనను బ్రజ్ఞ నీ వొంది రమ్మ
టంచు నిన్నను వీని నీ వంటివి గదె !
మాత యగు నవసరము నిర్మాణమునకు.

జననీస్తనమే లోకం,
బని తలఁచెదునంతకాల మలనిసువున కే
మనఁ బనిలే దిఁకఁ దదుపరి
ననవలెఁ గా నదియు నిదియు నందుట కవనిన్.

## కవిరాజు.

కవనము నుడువనిచో నీ
యవనీశ్వరుఁ డెడఁడు జీవనాధార మటం
చవనీసురుఁ డేకాగ్రత
ను వఱలి కవియయ్యెఁ దావినూత్నవిధముగాన్

ఏకాగ్రతార్క తేజము
లోకాజ్ఞానాంధకారలోప మొనరుపన్
బ్రాకట మగు కారణ మని
యోకువలయనాథ! నీవయోజింపు మిఁకన్.

యతులన్, బ్రాసములన్, గణంబులను, శ
బ్దార్థంబులన్, సద్రసా
చితులన్, శయ్యల, జాతులన్, వితతశా
స్త్రీయ ప్రయోగంబులన్
గృతులం జేయఁ దలంచువార లిల నో
క్కింతైన నాచార్యసం
గతిఁ దా మెంతయు నేర్వకే రచనమున్
గావింప రా దందువో.

# కవిరాజు.

"జలచరకోటిఁ గల్గెదవా?
చారుమణిప్రభ నొందుదో, మహీ
వలయముఁ జుట్టి రాఁ గలవా?
వారిద మంటెదవో? సముద్రముక్
బలె సెలయేఱ! యేల యిటు
పాటలు పాడుచుఁ దుళ్లుచుంట? భూ
స్థలి విడనాడు మీ" వన ర
సజ్ఞులు పక్కున నవ్వు కుందురే?

కవితావేగము గల్గు వారలు నిరా
ఘాటాతివృత్తప్రమో
దవిహారప్రియులై మహానియమబం
ధాతిక్రమోద్వేగభ్రా
న్నవకూలంకషతుల్యతందగి యన
న్యప్రాప్తధీజాతభా
వవిశేషానిలధూయమాను లయి కా
వ్యాఖ్యాబ్ధిలో మున్గరే?

# కవిరాజు.

భావావేశము, భావవర్ధనముఁ త
ద్భావాధికాభాసమున్,
భావప్రాజ్ఞత, భావనిఘ్నత, సదా
భావప్రభాభావ మే
జీవం డొందునో యాతఁ డొంది కవితా
శ్రీశక్తి సృష్టిస్వభా
వావిర్భూతరహస్య మిద్ది యను మాం
ద్యగ్రస్తజీవాళికిన్.

భావకవి యని వానిని వాకొనఁ దగు
వాఁడు విరచించునది యగు భావకవిత
భావకవి యగునీపేదబాఁపఁ డధిప !
వీనికవితను భావ మువ్వెల్లులూరు.

తనదువినూత్న భావకవి
తాప్రతిభాసితకీర్తిచంద్రికా
వనధిని దేలి పోఁ దగిన
ప్రస్తుత కాలము రామి బాఁపఁ డా

# కవిరాజు.

క్రొత్తనిఁ దనపొట్టకూటికయి
దెవ్వరుగొట్లు నతెక్ రచించి, కై
వ్వసఁ దనకైత నాడుటను
బో పరిహాసపరీతుఁ డైతగెన్.

కోమలరాగభోగ, మెల
కొమ్మలు, సన్మనోవిలాస, ము
ద్రామనరాగులు, స్వలపుఁ
దాపము, పల్లవకోటినిండుకో
నామనివేళఁ బాడఁ దగు
నాపరభృన్మణి. దా సకాలమం
దేమఱి పాడి శ్రోతలకు
నింపును సొంపు ఘటింప నేర్చునే ?

పూర్వకవులయం దపూర్వభావము లేదో
కారె వారు భావకవులు? పేద
బాఁపఁ దొక్కఁ జెట్లు భావకవీశ్వరుఁ
డనుచు నడిగె దేమొ యాలకింపు.

## కవిరాజు.

కనకలతామణిమంజరు
లోనరుకవనపంజరముల నుంచిరి తమమో
హనభావరాజకీరము
లను మునుపటికవులు కావ్యలక్ష్మీధవులై.

వితతాగాధమహారసాయతనమై
పెంపారువృత్తాబ్ధి సం
స్థితునిం గాఁ దను డించి భావకవి యెం
దేఁ బోవ నద్దాని సం
స్మృతిచిహ్నంబుగ నెంచి భావకవి ని
ర్మించు౯ ప్రయత్నించి ప్ర
స్తుతపద్యాకృతిపంజరం బొకటి స
ద్యోమోదసంప్రాప్తికై.

పూర్వకవిపద్యపంజరంబులను వెలయు
భావకీరములను నెప్డు నీవు గాంతు
నేఁటియీకవిపద్యంపునీడమందు
వానిఁ గనలేక పోవచ్చు వసుమతీశ!

క.రా

కవిరాజు.

తనగీతంబున నీకుఁ గన్పడనియో
    తద్భావతత్త్వంబు నీ
వనుమం చాతనిఁ బ్రశ్నసేయకుము స్వ
    ప్నాంతర్గతానంద, మే
జనుఁ డైనన్ దగ వాకొనం గలఁడె ? యి
    చ్ఛానంద మీ వొంది త
ద్ఘనభావాండజపంక్తితో నెగిరి యా
    తత్త్వంబుఁ జింతింపుమా?

ఈకవితత్త్వమున్ మఱియు
    నీకవిభావకవిత్వతత్త్వమున్
బ్రాకటలీల నే నిపుడు
    భావన చేసితిఁ గాన నీనిప
ద్యాకలితాతిభావము దు
    రత్యయ మంచు వచింతు నింక నీ
కోకుతలాధినాథ ! విను
    ముత్సుకత న్నిడనాడ కోపికన్.

# కవిరాజు.

కొండవీడురాజ్యసంకుచితనామము కొండ
యంచు భవద్ధ్వజ లాడుచుండ
గువ్వలు మీయీవిఁ గూర్చి గూగూలతో
స్వర్గస్థు లాలింపఁ జాటుచుండ
తమదానధారాజలము వాఁగులై రసా
తలమేఁగి మీయీవిఁ దెలుపుచుండ
ఆకందుకూరుసింహాచలవ్యాప్తమై
భవదీయరాజ్యంబు ప్రబలుచుండ

ఎన్న సింహాద్రినాథుఁ డప్పన్న చెవులఁ
దనరుబంగారుపోఁగులు తావకీన
భక్తిసంయుక్తవితరణశక్తిఁ జాటు
చుండ యగు దీనిభావ మోయుర్వరేశ !"

అనుచు శ్రీనాథుఁ డనుపన్యాసము విని
సంభ్రమాశ్చర్యములు మది సందడింప
సింహపీఠిక విడి నృపశేఖరుండు
సాఁగి శ్రీనాథునకు నమస్కార మిడుచు.

శ్రీమాడపాటి బాలకృష్ణమూర్తిగారి
బహూకరణ

# కవిరాజు.

నను తెనాల్వరలు తేరు నీకుఁ గవిరా
జా! కృష్ణపక్షాంత్యకా
కను నిక్కంబుగ శుక్లపక్షయుతకా
నం బంచు వాదించి గె
ల్పుమరం బొందెదు కౌశలం, బణువునం
బదీంద్రియు స్థూపుజ్ఞా
నను నీసామ్యు; కృతార్థుఁడన్ సమధికా
నుమానంబు నే నొందితిన్.

కవినామం బది సార్థకం బగును లో
కంబందు నీపట్లఁ బ
త్కృవిసృష్టిన్ బరమార్థ మెంచునతఁ డో
క్కం డౌఁ జుమా నిక్కఁపున్
గని ధాత్రిన్; గవినామమాత్రగులు ప్ర
ఖ్యాతార్థశూన్యుల్ గదా!.
కవినామంబును నీటికాకియును లో
కంబాదుఁ దా నొందదే?

౫౧

# కవిరాజు.

అని కవితిలకుని ఘనముగ
వినుతి సలిపి వెనుక ధరణివిభుఁ డలరుచు బాఁ
పనిఁ గని పనివడి యనె నా
ననమున నునునగవు లెనయ నలువగునుడులన్.

బళిబళి! యెంతలోనఁ బ్రతి
భావిభవంబు వరించె నిన్ను, నీ
కిలఁ గలపృజ్ఞ పేదటిక
మే యని యంటివికాదె? నిన్ను, ని
స్తులగిరినిర్ఝరోత్పతన
తుల్యకవిత్వపటుత్వధార ని
న్వలచుట వింత యయ్యె, ఘన
భావ! కృతార్థుఁడ వైతివే సుమా!

వాణీనిర్హేతుకదయ
రాణను నీ వొందకునికిఁ బ్రార్థించితివో
వాణీశుని శ్రీనాథుని
యానారీదయకు వాక్సహాయము సేయన్.

## కవిరాజు.

శ్రీరామాయణపఠనము
భారతభాగవతసత్ప్రబంధపఠన మా
రారా ! కవితాధోరణి
కారయ నవసరము కా వటంచుఁ దెలిసితిఁన్.

ఎంతవిచిత్రఁపున్గవన
మియ్యది, పద్దెము నెంత గాంచినన్
సుంతయు భావగోచరత
చొప్పడ దద్దిర ! కాని పాదపా
దాంతరసీమలందును ర
హస్యవిభావము గల్గ నోపు, నీ
కెంతయుఁ నీమకైత తగు
నెన్నఁగ నీదగుశక్తి యల్పమే !

కృత్యనంతరోత్సవమున కేగువేళ
సచివవరుఁ గనుఁగొని రాజచంద్రుఁ డంత
నీయపూర్వఁపుఁగవికి నీ వి మ్మనర్ఘ
పారితోషిక మని సభ వాసి చనియె.

# కవిరాజు.

పులినోటఁ బడి తప్పిపోయినటు లూ
ర్పుల్ పుచ్చుచుఁ బేదవాఁ
డెలమిన్ బా వెలలేనికానికల నె
న్నే నొంది శ్రీనాథుఁడున్
బలుమాం తెన్నుచు నాఁటియుత్సవపుశో
భ జ్జూడ నూహింప కే
యిలు సేరెన్ దనభార్యయున్ సుతులు త
న్వీక్షించి యుప్పొంగఁగన్.

ఒకచేత ఖడ్గంబు నొకచేతఁ గావ్యంబుఁ
గొని యేన్గుపై నేగునినుని గనుమఁ
ప్రభుపార్శ్వభాగాన భాసిల్లు శ్రీనాథ
కవిరాజునకు నమస్కార మిడుచుఁ
బతదుల్కలను మించి పరిహాసించుచు మీఁది
కెగురుజువ్వలఁ బరికించి నగుచు
వరకృపాణములతో, వంశదండములతోఁ
జతురులు గావించుసాముఁ గనుచు

# కవిరాజు.

నతులమంగళతూర్యవాద్యములు వినుచు
నాఁటవెలఁదులనృత్యముచేటుఁ గనుచు
నుత్సవాలోకనాగతు లుత్సుకతను
నొండొరులఁ దోసికొను చేగుచుండి రపుడు.



పరశృంగారరసప్రధానకవితా
వైదగ్ధ్యసంపూర్ణుఁ, డీ
శ్వరపాదాంబుజచింతనామృతరసా
స్వాదప్రమత్తుండుఁ, గా
కవిమత్తేభగణోగ్రసింహుఁ, డవనీ
కాంతాగ్రసేవ్యుండు నా
కవి శ్రీనాథుని సంస్మరించుచు నమ
స్కారంబుఁ గావించెదన్.



# భావకవిత్వము.

రెండుకాకులు కూర్చుండె బండమీఁద
నొం డెగిరిపోయె నంత నం దొండు మిగిలె
రెండవది పోయెఁ బిదప నం దొండు లేదు
బండమాత్రము పాప మం దుండి పోయె.

ఆయనంతప్రణయవార్ధి ననిలవివశ
మై జనించిన. యల వళి యై, తరంగ
మై, మహోత్తుంగకల్లోల మై, తదీయ
తీరమున భంగమై వార్ధితీర్థ మయ్యె.

ఆమనోజ్ఞసుమధురసాయంతనసమ
యమున వల పూని నీ ళ్ళాడి యస్మదీయ
హృదయతంత్రులు మీఁటి హాయిన్ రచించి
కాలసర్పకరాళవక్త్రమునఁ గరఁగె.

ఆనిశాకాచగోళాంతరాన స్నిగ్ధ
కమ్రతరనాతిదీపికాకళిక మినుకు
మినుకు లాడి హఠాద్దీప్తి నెనసి శిథిల
తిమిర చేలాంచలంబుల సమసిపోయె.

శ్రీకృష్ణ దేవరాయాంధ్ర భాషానిలయము
సుల్తాన్ బజార్, హైదరాబాద్. 1.

# భావకవిత్వము.

అస్మదీయాంతరంగాపరాశి విమల
రాగ రేఖావిలాసవిభ్రాజితముగఁ
బొనరుచుండియుఁ దమమున మునిఁగి పోయె
మినుకు లలరునె తాను లేమిని జగాన?

# భావతురంగము.

భావకవిత్వసంపద ల
    పారము గాఁ గలఖండకావ్యముల్
నే విరచించి యన్నిటిని
    నీ టఁగుపొత్తముగా ఘటించి, సం
భావనఁ జేయుచుంటిని వి
    భావరి నా కృతి నామ మే మనం
గావలె నంచుఁ గొంతదను
    కన్; వెనుకన్ గొనినాఁడ నిద్దురన్.

అద్దమరేయి నొక్కపురు
    షాకృతి తోఁచెను స్వప్నమందు నా,
కద్దిర ! పంగనామముల
    నాస్యమునన్ రుదురాకపేరులన్
బెద్దవి కంఠసీమమునఁ,
    బిల్లని చంకను, దాటియాకులన్
గొద్దిగ నొక్కచేత, నొక
    కుంచెను రెండవచేతఁ బూనుచున్.

# భావతురంగము.

నిను నాశిష్యునిఁ గాఁ గై
కొనినాఁడను కవిత నీవు కూర్చినపాత్రం
బున కేది తగినపే రని
యనుతాప మి దేల విను మదశ్వచరితముల్

తపనీయమణిమయోద్దామపరిభాభాసి
తోత్తుంగసింహాసనోజ్వలంబు
కవిగాయకవితానగంభీరగీతాను
ధారసధారాప్రపూరితంబు
అఖిలశాస్త్రేతిహాసార్థవిత్పండిత
పాండిత్యచర్చాతిమండితంబు
గాంగేయవిజయవిక్రమకళాకలితాంధ్ర
వీరసింహసమూహవిలసితంబు

నవ్యనాట్యకళాసమున్నతవయోను
షంగవారాంగనాపాంగమంగళంబు
వ్యాజనయుగ్యంత్రిపుత్రికాభ్యంచితంబు
నాతతము కృష్ణరాయసభాంగణంబు.

# భావతురంగము.

కొలువు దీర్చి రాయలు గూరుచుండె
సింహపీఠిక నాసభాసీమయందు
విజయఘంటిక మ్రోయఁగఁ బ్రజలు నలర
వందిమాగధు లాజేనిప్రతిభఁ జాటు.

అంత నొకచిత్రలేఖకుఁ డటకు వచ్చి
యశ్వచిత్రపటము దెచ్చి యవనిధవున
కిచ్చె నద్దాని రాయలు మెచ్చి కొంచుఁ
జూపి సభ్యుల కిట్లు సంస్తుతులు సల్పె.

"ఎంత మనోజ్ఞమై తనరు
నీజవనాశ్వవిచిత్రలేఖనం,
బింతయు లోటుపా టెచట
నెంచఁగ రాదు, సజీవవాజి న
త్యంతముఁ జూచినట్లు లగు,
దా, టెడుగుఱ్ఱము దాఁటునట్లుతో, ?
వింత చెలంగ వ్రాయఁ బడె,
వేలకుమించినమూల్య మీఁ దగుఁ."

# భావతురంగము.

అనుచుఁ గొనియాడి చిత్రలేఖనముఁ జిత్ర
కారునకు వేనవేలురూకల నొసంగి
"కలఁడె యొకఁడైన నీచిత్రకారు మించఁ
జాలెడునతండు నాదునాస్థానమందు"

అటులు భూజాని యాతని నభినుతింపఁ
గుపితమతి నొచు నే నంటిఁ "గువలయేశ!
పరచునీ తేజి యీచిత్రపటము వదల
దిందుఁ గలచిత్ర మే మొకో సందియంబు.

తగులదు మెత్తగా దరిసి
తాఁకిన, భీతిఁగలంగఁ జేయఁగా
నెగురదు, కొంచె మైన సకి
లింపదు, వాలము ద్రిప్ప, దిట్టిద
శ్వగణమునందు నున్నె, నగ
పాలు గనంబడ, డెట్టిచిత్ర, మీ
పగిది విచిత్రచిత్రములు
వందలు వేలు రచింప కుందునా?"

౬౨

# భావతురంగము.

అనఁగ వసుధేశుఁ డాడె నాకంత నిట్టులు
"భావనము చేయ వలె చిత్రపటము దెలియ
భావశూన్యున కదికుడ్యభావ మొసఁగు
నీకళాపరమరహస్య మిది నిజమ్ము.

వందలు వేలు వ్రాయఁ గల
వాఁడవు నీవు సెబాసు ! సత్కవీ !
ముందుగ నొక్కచిత్రపట
మున్ రచియింపుము దానితోడ నీ
యందునెసంగుప్రజ్ఞ తెలి
యం దగు" నంచు క్షితీశుఁ డాడె నే
నందుల కొప్పికొంటి, సభ
యందలియందఱు నబ్రి మొందఁగన్.

  

కొలువు చాలించి భూమీశతిలకుఁ డేగె,
తేపకడ లేచి మఱునాఁడు ఱేని దైన

# భావతురంగము.

యీసభాభవనాంతరమందుఁ గుడ్య
సీమ నొకచోట వ్రాసితిఁ జిత్తరువును.

రాయలు వచ్చి యంత నప
  రాహ్ణమునన్ సకలాంధ్రరాజలో
కాయతవైభవంబున స
  భాంగణసీమను బల్కె నల్కమై
"హేయవిధానఁ గుడ్యతల
  మీఁగతిఁ బా డొనరించె నెవ్వఁడే
రా" యను నంత నే నలధ
  రాధిపుఁ గాంచుచు మాఱు పల్కితిన్.

"గోడఁ బాడు చేయుజాడగా దది నేను
గోడమీఁదఁ గడఁకఁ గూర్చినట్టి
చిత్తరు వది కాని, క్షితినాథ! వే ఱొండు
కాదు, దానిఁ గాంచ నాదుమనవి."

ఔరా! చిత్తరు వేది, కుడ్యమున హే
  యం బౌమసిన్ బూసి, యా

# భావతురంగము.

ఝోరన్ గుంచెను వెల్లఁ గొట్టి, యిటు హా
   స్యోక్తి ప్రవజం బాడుదే?
పారం బన్నది లేదె యెంతకుఁ ద్వద
   భ్యస్తాతిహాస్యోక్తి క
య్యారే! యియ్యది యాచిదంబరరహ
   స్యప్రాయమా నేమొకో?

అనుచు భూనాథుఁ డించుక యలిగి పలుక
"భావనము సేయువలెఁ జిత్రపటమ్ముఁ దెలియ
భావశూన్యున కది కుడ్యభావ మొసఁగు
నీకళాపరమరహస్యమిది నిజమ్ము."

అని నే నాడినమాటలన్ గినుకఁ దా
   నాలించి "నీచిత్రలే
ఖనమం దొప్పెడుభావమున్ దెలుపు ప్ర
   ఖ్యాతంబుగా, నద్ది నేన్.
వినెదన్, నా కది నచ్చ కుండునెడ నీ
   నేరంబు సైఁపన్ జుమా"

# భావతురంగము.

యనె ధాత్రీశుఁడు "వల్లె" యం చతని కే
నావెన్కఁ ని ట్లాడితిన్.

అడిగిన భావమున్ దెలుప
నౌ, నటు లెందఱే కంట వీ లగున్
బుడమిని, సాధ్య మద్ది యగుఁ
బో కృతికర్త గతించు వెన్కఁ నే
వడువున నద్ది బోధపడుఁ;
బాఠకు లెందును స్వీయశక్తిచేఁ
దొడరి గ్రహింపఁగా వలెఁ గృ
తుల్; కృతిపాఠకధర్మ మిద్దియే.

కవులును జిత్రలేఖకు ల
ఖండగభీరవినూత్న భావముల్
ప్రవిమలనవ్యసత్కృతుల
రాజిలఁ జేతురు గాని, తత్కృతి
ప్రవరరహస్యభావముకు
రప్రతిబింబితపూర్ణతత్వమున్

# భావతురంగము.

వివిధజనాళి మెచ్చఁగ వి
వేకము బుద్ధియు నీయ నేర్తురే?
ఆత్మరూపము దేహమై యలరు నటులు
భావరూపము చిత్ర మై పరఁగు, భావ
రహితచిత్రము జడ, మాత్మరహితదేహ
మటులు, భావము జీవన మఖిలమునకు.

రంగులు రేఖలే నయన
రమ్యవిచిత్రపటంబునందు ము
ఖ్యాంగము లంచు భ్రాంతిపడు
నాతఁ డెఱుంగఁడు దానితత్వ, మా
రంగుల వెన్క గుప్త మగుఁ
బ్రాంచితభావవిశేష మెంచు తె
ల్విం గలవానికే తెలియ
వీ లగుఁ జిత్రకళారహస్యముల్.

ఉన్నది యున్న దం చనుచు
నుండెదువాఁ డధముండు, తెల్విమై

# భావతురంగము.

నున్నది లేదటం చనుచు
నుండెడు నాతఁడు మధ్యముండు, లే
కున్నది యున్న దం చనుచు
నుండునతం డిల నుత్తముండ యా
నెన్నఁగ ముత్తెలుంగులు మ
హిం గలయట్టివిమర్శకుల్ నృపా!

కచబంధచ్యుతకేశలేశ మొకచోఁ
గన్పట్టఁ దన్నైల్యముఞ్
రుచులఞ్ దత్పరిమాణ మెంచి యది యే
లోలాక్షిదో, యామె నే
రుచు విద్యావిభవంబు లెట్టివో, వయో
రూపంబు లేపాటివో
వచనం బెట్టిదొ, పోల్చు నాతఁడె కళా
వైదగ్ధ్యసంపూర్ణుఁ డౌ.

జ్యేకపరమాణువుఞ్ గను "చ
యోయయ"మై మునుఁ బొల్చునీపరిపం

# భావతురంగము.

చకపరిణామతత్వమును
సర్వము నెమ్మది నూహ సేయుచే
ప్రకటవిమర్శకప్రవర
లక్షణా, మియ్యది నిక్క మోప్రభూ!
వికటకవీశువా క్కని యు
పేక్ష సహించి హసింపఁ బోకుమా!

అట్టుల యుపేక్ష సేయునెడ
నక్కట సత్కళ లెల్ల గొడ్డువో
వుటయె ఘటిల్లు, నంతఁ బరి
పోషితభావకవిత్వజీవముల్
పటుతరచిత్రలేఖన మ
భావగతస్థితిఁ గాంచుఁ గాన నిం
తటను మదీయచిత్రరచ
నాప్రథితార్థము నాలకింపుమా!

గండుమై గఱులెత్తి కొండ లుద్దండత
నెగురుచున్నట్టులు భావించుకొనుము

# భావతురంగము.

బ్రహ్మాండభాండార్తి వాప నిర్జరు లింద్రు
  వేఁడుచున్నటులు భావించుకొనుము
ఇంద్రుఁడు వెలిమావు నెక్కి వజ్రాయుధం
  బెత్తి పోవునటు భావించుకొనుము
చిత్రంబునందు విచిత్రింపుమసిపూఁత
  యే మబ్బులంచు భావించుకొనుము

అట్టిమబ్బులఁ జొచ్చినయామహేంద్రు
వాజివాలాగ్ర మీఁకనఁ బడెడుతెలు ప
టనుచు భావించు కొను మింక వినుము దీ॥
పేరు భావతురంగంబు ధారణీశ!

అనునాదునుపన్యాసం
బును విని పార్థివుఁడు నవ్వి మో మెత్తి యనెఁ
విను చిత్రకళానిధి ! నీ
యనుపమచిత్రకళ సార్థకాఖ్యం బయ్యెన్.

అనుపమసత్కృతికిఁ బ్రయో
జన మానందంబు, నాకు సంధిలె నది నీ

# గావతురంగము.

వినుతవిచిత్రముకతనఁ
గన నల్పమె నీదుచిత్రగతకౌశలముఁ.

బళిరా! యింతటిదాఁక నీకుఁ గవితా
    ప్రావీణ్యమే కల్గుటన్
దలఁతుఁ జిత్రకళాధిదేవతయు నిఁ
    గామించుటల్ నేఁడు గా
తెలిసెన్ మాకు యమానుజాంతరిత మా
    దేదీప్యమానప్రభా
వలసద్గుప్తసరస్వతిం బలె మహా
    పర్వంబుసంధించుచుఁ.

భావతురంగ మంచుఁ బరి
    పాటిగ నియ్యది పేరుఁ గాంచి యిం
దే విలసిల్లుఁ గాక యని
    కృష్ణవిభుండు వచించి, దానిపై
నావిమలాక్షరంబులు ర
    యాన లిఖింపఁగఁ జేసి యంత నా

# భావతురంగము.

కావిభుఁ డిచ్చెఁ గానుక లపు
డచ్చటి సభ్యులు మచ్చరింపఁగన్.

ఆనాఁ డాదిగఁ బెక్కువత్సరము ల
య్యాస్థానమం దుండె వి
న్నాణంబై తగు నాదు చిత్తరువు, వె
న్కన్ శత్రు లయ్యాంధ్రసం
స్థానం బెల్ల జయించి దుర్గములఁ బ్రా
సాదంబులన్ గొట్టి విం
తే నాభావతురంగమున్ గడచె నాఁ
డే కంటికిం దూరమై.

మఱచిరి లోకు లెల్లరును
మామక భావతురంగనామ మ
త్తఱిమొద, లీవు దానిచరి
తంబును గ్రమ్మఱ నేఁడు చాటి త
త్పరమవిచిత్రనామము స
దా భువి నిల్చెడునట్లు చేయ నీ

## భావతురంగము.

గురువరునాజ్ఞ యైన దను
కొంచెకఁ దద్వరకార్య మూనుమా !

మామకభావనాశ్వ మగు
మాతృక తావకభావ గీతికా
దామనియుక్తసత్కృతికి,
దానిఁ దలంచుచు నుంచు మోయి! నీ
వీమహి నీదుపాత్త్రమున
కింతట భావతురంగనామ, మా
నామమె చాటు నీదురచ
నాగతభావగభీరతత్త్వముల్."

అతఁ డీరీతినిఁ బల్కి తత్క్షణమె మా
యం బయ్యె, నా కంతలో
స్మృతి గల్గెన్, గను విచ్చి చూచుటనె నా
చెంతన్ గనన్ దోఁచె మ
త్కృతభావోన్నతఖండకావ్యవిలస
ద్విఖ్యాతసద్గ్రంథ, మా

# భావతురంగము.

కృతికిన్ "భావతురంగ" నామ మిడి త
 త్కీర్తిన్ బ్రతిష్ఠించితిన్.

ప్రాచురోజ్జ్వలకీర్తి రూపలలనా
రక్తాత్ముఁడై, హాస్యవా
చాచాతుర్యగుఁడై, విమర్శనకళా
చంద్రుండు నై, కాకవి
ప్రాచీనాహిమయూరుఁ డై, కవిజన
ప్రాలంబుఁడై యస్మదీ
యాచార్యుం డగు "రామలింగకవి" నే
నశ్రాంతముం గొల్చెదన్.

---

౭౫

# భావకవి.

అస్మదీయాయతనమున నమపసనిశి
నూర్ధ్వలోకరహస్యభిదోపకరణ
నవ్యపరిశోధనైక యంత్రంబు గాఁగ
నుండుముక్కాలిపీట నే నుంచి మఱియు.

ఇక్కాలంబున వాదము
నెక్కొనుకవితావిశేషనియతిఁ గనుఁగొనన్
దిక్కనకవివర్యుని నే
నొక్కుమ్మడి ధ్యానమూన నులివొందు దగన్

ముక్కాలిపీట కదలఁగఁ
దిక్కనకవిసోమయాజి దిగె నని భక్తిన్
మ్రొక్కి విన నుంటి నాతఁడు
చక్కఁగ నెఱిఁగింప నున్నసందేశంబున్.

"తిక్కనఁ గాను- భావకవి
ధీరుఁడ - నూత్నకవిత్వతత్వ మా
తిక్కనయే మెఱుంగుఁ, దల
తిక్కకవీశుఁ డతండు, నేన స

# భావకవి.

మ్యక్కలన స్వచింపఁగ స
    మర్థుఁడ నాకవితావిశేష, మీ
వెక్కడ తిక్కయజ్వకవి
    యెక్కడ యంచుఁ దలంపఁ బోకుమా.

ఇరువది యేండ్ల దాఁక పఠి
    యించితి నాంగ్లముపాఠశాలలన్
దరుగ ధనంబు, దేహబల
    దర్పము లన్నియు నాఁడు నాఁటి, కా
ఖరునకు నందుఁ బాండితి త
    గం గనిపింపక పోయె, నింక నే
నెఱుఁగను సంస్కృతం బది మ
    హిం గలిలో మృతభాష యటంచేన్.

ఆంగ్లవిద్యాభ్యసనమున కైనకాల
మందు సగపాలు దేశభాషైకశిక్ష
కైన సంపూర్ణపాండిత్య మమర కున్నె?
యని వినుచువాద మేను మెచ్చను రవంత.

# భావకవి.

అవిరళపాండితీప్రతిభ
లన్నవి ప్రాప్తము కాకపోయినన్
లవ మగులాభ మేది యయి
నన్ గణుతింపఁగ లేక పోయినన్
నవనవహూణకావ్యపథ
నంబున నిక్కము దాఁపనేల నేఁ
గవి ననిపించుకొంట కొక
కాంక్ష జనించెఁ గ్రమక్రమంబుగన్.

సంస్కృతాంధ్రకవిత్వ రచనమునందుఁ
గోటి నియమము లుండుటఁ గోటి కొక్కఁ
డాపనికిఁ బూనుకొనుచుండె నాంగ్లమందు
నట్లు గా కుంట హూణులం దధికకవులు.

కైతకునుఁ గట్టుబాట్లకు జ్ఞాతివైర
మౌటఁ బ్రాచీనకవన మాహ్లాద మిడదు,
గానఁ గైతను నియమాలు గంగఁ గలిపి
యతినిరంకుశకవుల నే ననుగమింతు

# భావకవి.

కవనము, చిత్రలేఖనము,
　గానము సాజముగా జనించు నీ
భువిజనపాళికన్న నుడి
　పొల్లు సుమా, పురుషప్రయత్నమే
యవసర మన్నిటన్, బ్రతిత
　యత్నము ధారణ రిక్తవోవునే?
కవి యగు టొక్కకష్ట మగు
　కార్యము గాదు ప్రయత్న మూనుచోన్.

వ్రాయఁగా వ్రాయఁగా నగు వ్రాఁతగాఁడు
పాడఁగా పాడఁగా నగుఁ బాటగాఁడు
కైతఁ జెప్పంగఁ జెప్పంగఁ గవియు గానఁ
గవిగరుత్మంతుఁ డను గానొ కడఁగి తుదకు.

హూణభాషను గవినౌట కూహ లేదు
సంస్కృతకవిత్వరచనాప్రసక్తి కలుగ
దాంధ్రుఁడుగ బుట్టుటనుఁ దెనుఁ గాడ నౌను
గాన నే నాంధ్రకవి నౌటయే నిజంబు.

౨౫

# భావకవి.

గ్రాంథికాంధ్రరచన వృథాకష్టయుతము
గ్రామ్యభాషను గావ్యగౌరవము లవము
కాన నాభాషయే నాది గాఁగ నిఁక
నాంధ్రపైశాచిభాషఁ గావ్యము రచింతు.

చదువఁగ వ్రాయఁగ విసువుం
బొదలింపనిఖండకావ్యములు నే రచియిం
చెద నాంగ్లంబున నున్నటు
లుదయింప న్జేతు నూత్నయుగ మాంధ్రమునన్.

ఆరయ మోజ - వ్యాకరణ
మన్నది సున్న - ప్రయోగసంపదా
ధారము లేదు - లక్షణవి
ధానము రాదు - ప్రబంధనిర్మితిన్
గోరి ఘటించు పెట్టు లేకఁ
గుంఠితశక్తిని ఖండకావ్య మే
తీఱుననో రచించుటయె
దిక్కిఁక నాకను చెప్ప రాదిరేన్.

## భావకవి.

నగలన్ జేయుచు టంకము న్గొలిపి స్వ
    ర్ణభ్రంశము న్జేయున
ట్లోగిఁ బ్రాచీనకవుల్ ప్రబంధ మను చె
    న్నౌఖండకావ్యంబులన్
దగ భాషించియు వాని నెల్ల నదుకం
    గాఁ బొల్లుపద్దెంబులన్
దగిలింపన్ సమకట్టి తత్కృతుల స
    త్యస్ఫూర్తి మాయింపరే?

ఒకఛాయాపట మూని దానివలె నె
    న్నౌమూర్తులన్ జేయున
ట్లకటా! పూర్వకవుల్ ప్రబంధములు వ్రా
    యం జాలిరా రూహయూ-
రశమా- యాచితియా- నవీనగతియా
    ప్రాపంచికజ్ఞానమా-
యొకఁడున్ లే దిఁక గౌరవం బెటులు నా
    కుండున్ ప్రబంధాలపైన్.

# భావకవి.

అనుచుఁ దద్దుర్విమర్శనమును హరించి
కోరి పదియాఱువన్నె బంగారుపాళ
యనఁగ నొక్కొక్క ఖండకావ్యము రచింతు
భువి సదా కీర్తినొంది మెప్పును భజింతు.

మెండుగా భావములు రాక యుండు నేని
యుండెఁ గా హూణకావ్యప్రకాండ మవని
నందుఁ గలభావములఁ జేర్తు నాత్మకృతులఁ
దివిరి మద్భావచౌర్యముఁ దెలియ నీక.

ఆంగ్ల మెఱుఁగువాని కాంధ్రంబు తెలియ, ద
య్యాంధ్ర మెఱుఁగఁ దెలియ దాంగ్లభాష
యదియు నిదియుఁ దెలియు నట్టివారల నెల్ల
మన్మతంబుఁ బూన మార్చుకొందు.

నామతము స్వీకరింపక నాదు సమితి
యందు సభ్యుఁడు గా కుండ నస్మదీయ
భావచౌర్యముఁ బ్రకటింప వచ్చువాని
కిట్టు లని బుద్ధి సెప్పెద గుట్టు సెడక.

# భావకవి.

కలుగునె వ్యక్తిభేదమును
గాలవిభేదము దేశభేద మీ
యిలఁ దలపోయ భావమున-
కెందఱికే నది దోఁచు నీడనో,
తలఁపఁగ నేడనో, యిపుడొ
తప్పిన నెప్పుడొ నిశ్చయంబు, నిన్
గలఁచెడుసంశయంబునకుఁ
గారణ మజ్ఞత దుర్విమర్శకా !

భావము భాషయు నవినా
భావం బగుమైత్రి నుంట భాషను వినుచో
భావము స్ఫురింప వలెఁ ద
ద్భావంబును దెలుప నుచితభాషయు వలయున్.

ఆలక్షణములు మద్గీ
తాలను గనరామిఁ గుకవి తప్పులు వట్టం
బోలు నని యూహ సేసియు
నీలా గని తర్క మూన నెంచితి నంతన్.

# భావకవి.

కంటకాకీర్ణశాఖానికాయములను
జెండి, నియమాన ఖండించి, చిన్నరంధ్ర
ములనొనర్చినఁ గాని సమ్మోహనైక
గాన మొసఁగునె పిల్లనఁగట్ర భువిని.

పలుగులకణాలు గలిగినఁ
గలుగునె సున్నంబు కొలిమిఁ గాల్చియు వానిన్
జలమునఁ గలుపక-కష్టీ
షలీ యనెడి నుడిని దలఁప వలదే మదిలోన్.

ఆలోచనాగ్ని మద్గీ
త్రా [illegible]గి సంస్కృతము గాఁగఁ దగ రసయుక్తిన్
గా్రిలును భావసుధాసా
రాలు మహాకావ్యసౌధరచయిత మెచ్చన్.

నీదుపద్యభాష నే నెంత గనినను
భావ మొక్కఁ డేని బయలుపడదు
నీవ నీదుపద్యభావము నను మన
స్హ్లాదముగ నగుచు నిట్టు లందు.

# భావకవి.

సర్వమిథ్యాప్రపంచంబు సత్య మనుచుఁ
జెలఁగి వాదోపవాదముల్ సేయునట్టి
కవివిమర్శకులకుఁ గష్టకార్య మానె
భావ మొక్కఁడు గన నాదుపద్దెమందు.

భావావేశసమయమున
నే నేవో వ్రాసినాఁడ నిపు డడుగఁగ నే
నేవిధిఁ దెలుపుదు? నీ వా
భావావేశంబు నొంది భావింపఁ దగున్.

ఇటులు కృపాణఖేటముల
    నెల్లఁ దయా రొనరించికొన్నయం
తటఁ బ్రకటించినాఁడఁ గవి
    తారతి నాఁబడుమానసపత్రికన్
స్ఫుటముగ మన్మతానుగత
    సూక్తుల నెల్ల వెలార్చినాఁడఁ, బి
మ్మట సమకూర్చినాఁడ గరి
    మంబున భావకుమారసంఘమున్.

# భావకవి.

తెనుఁ గాడుటను వ్రాయుటను దెలియ వలె
నాంగ్లభాషాజ్ఞాన మవసరంబు
దేశాటనోత్కటావేశ ముండ న్వలె
నుద్యోగమున బుద్ధి యుంచ రాదు
భావగీతాలను బాడుచుండ న్వలెఁ
బూర్వకవులఁ దిట్టిపోయ వలయు
స్వేచ్ఛావిహారంబు సేయ వలెఁ, సభ్యు
లొకరినొకరు మెచ్చుచుండ వలయు

నవ్యకవి సెప్పినది యెల్లఁ దప్ప వలయు
నరయఁ గర్ణద్వయముఁ గప్పి యాడుకురులఁ
బెంచ వలె, నూత్న వేషంబు వేయ వలయు
మాసమితిసభ్యులకు నియమంబు లివ్వి.

పరిహాసితకవులరచనా
సరణిని గవిసమయములను శయ్యను వృత్తిఁ
సరసాలంకృతి జాతులఁ
బరిహార మొనర్చి నూత్నపథగమనుఁడ నై.

# భావకవి.

పరిపూర్ణచంద్రబింబం బనఁ దత్కవుల్
తామరపాకంటెఁ దన్విమోము
దొండపం డనఁ బూర్వపండితమండలి
యింద్రచాపం బంటి నింతిమోవి
కలువరేకు లనంగఁ గవులు ము, న్నేను బా
దముకాయలంటి మదవతికనుల
అళు లనఁ దొలికవుల్, యంత్రశాలాగత
ధూమ మంటిని నేను జామకురులఁ

గుకవులను వారు దిట్టంగ సుకవివరుల
నేనుఁ దిట్టితి నెందు నాకృతులయందు;
బ్రతికినన్నాళ్ళ కొక్కకావ్యంబు వారు
వ్రాయ వందలు వేలు నే వ్రాసినాఁడ.

అఖిలజీవేశ్వరు నభినుతింపఁగ వారు
జీవితేశ్వరిఁ గూర్చి చెప్పినాఁడ
ఱేఁడుల పెడ్లఁ గూరిచి వారు రచియింప
బసులకాపరులపై వ్రాసినాఁడ

# భావకవి.

భగవంతునకుఁ గృతుల్ వా రంకితము సేయ
సోదరకవి కిడి చొక్కినాఁడ
ఫలవృక్షవితతుల వర్ణింప నవ్వారు
తృణకణంబులను వర్ణించినాఁడ

పద్యశతమున వారు కావ్యంబు వ్రాయ
పద్యమొంటను నొకకావ్యభావ మడఁచి
వ్రాసి నాఁడను గావునఁ బద్దెమునకు
నొక్కపొత్తంబుఁ బ్రచురించి యుంటి నేను.

ఇట్టు లెన్నేఁ గృతులు రచియించినాఁడ
దేశదేశాలవెంబడిఁ దిరిగినాఁడ
వాయి నొవ్వంగ గీతాలు వాడినాఁడ
భావకవి యనునొకపేరు వడసినాఁడ.

ఇతరకృతిరత్నములమాట కేమి గాని
"అధికమాస" నామంబున నస్మదీయ
ఖండకావ్యాలు గొన్నింటిఁ గడఁగి కూర్చి
యెలమి నొకపొత్తమును బ్రచురించి నాఁడ.

# భావకవి.

ఉభయభాషాప్రవీణు లత్యుగ్రమూర్తు
లగుచు నుండిరి మత్కావ్య మరసి- కాని
యాంగ్లభాషాభిమాను లత్యాదరమున
నాంధ్ర "కీట్సు" ని నను( గొనియాడుచుండి).

అరసికులుసంస్కృతాంధ్రవిద్యాప్రవీణు
లనుచు నవ్వారితో వాదు లాడ కుంటి,
మఱియు దుర్గ్రాహమగు మద్విమర్శనంబు
కాన వాదింప దొరకొన్న( గార్య మున్నె ?

తెనుగును నాంగ్లముల్ దెలియు
దిట్టరులందు ననేకు లాది నే
నను గొనినట్లు నాసమితి
యందొగి( జేరక( యుంట, దుర్విమ
ర్శనమున సంస్కృతాంధ్రకవి
సంతతి నట్ హాసియించుచుంట, నా
ఘనకవితాప్రవృత్తి కిది
కాలము గా దని నే నెఱింగితిన్.

# భావకవి.

శరదములు మేఱుము లురుములు
కరకలు జడి గలుగువర్షకాలమునం దా
పరభృతము పంచమస్వర
సురుచిరగానంబు సేయఁ జూచుటఁ గలదే?

కుకవి బొమముడి మబ్బులు, కోపదృగ్వి
తానవిద్యుత్తులు, విమర్శనానుగర్జ
లలము దుర్దినములలోన నస్మదీయ
సుకవితాపరభృత ముండుచోటు కలదే?

ఘనతరు లుర్వి రాగ మయ
గౌరవ మొందెడు వేళ, నమ్రజీ
వనరతినుండువేళ, రస
వత్సుమనస్స్థితి నొందువేళఁ గ్ర
క్కునఁ దను వెత్తి మత్కవన
కోకిల గానరసానుభూతిఁ ద
ద్ఘనతరు లాత్మమస్తకని
కాయము నొయ్యన నూఁపఁ జేసెదన్.

అనుచు నయ్యాంధ్ర 'కీట్సు' సమాఖ్య సార్థ
మౌట కొఱకు జేసికొంటి నే నాత్మహత్య ;
నాంధ్రకవితాంబురాశిరసాభివృద్ధి
కగు మహాద్వీపవతి త్రోవ నంతరించె.

భూలోకజీవితంబును
జాలించియు నేఁటి కాయె సంవత్సర, మేఁ
బై లోక మేగ లే, నీ
భూలోకమునన్ జనింపఁ బో నిపు డపుడే.

బలవన్మృత్యువు నొందుటన్ గృతుల నేఁ
 బైశాచిభాష న్మహీ
స్థలి భాషించుటఁ బ్రేతలోకము నివా
 సం బబ్బెఁ గార్మబ్బులో
పల సౌదామనిఁ బోలుమే లొకటి ప్రా
 ప్తం బయ్యెఁ దల్లోకమం,
దలమెన్ సూక్ష్మత బుద్ధి కైహికతను
 త్యాగంబు ప్రాపింపఁగన్.

# భావకవి.

స్థూలదేహము విడుచుట, సూక్ష్మదేహ
మొందుటనె సూక్ష్మబుద్ధి నే నొందినాఁడఁ
బూర్వ మే నెఱుఁగనిభావభూతి దోఁచు
మద్రచితభావగీతాలమాల నిపుడు.

ఇపు డుదయించుభావముల
నేను వచించి వెలార్ప వీలు లే
దపు డపు డిట్లు నీకడకు
నాఁదట వచ్చి లిఖించుచుండు, నీ
వెపుడు మదీయగీతముల
కీనవభావములన్ వెలార్తువో
యపుడు కృతార్థతన్ బుడమి
యం దుదయించెద నేను క్రమ్మఱన్.

అధికమాసాఖ్యకావ్యమునందు నుండు
నఖిలగీతాలభావము లాడి పోవ
వేళ యీరేయిఁ జాలమి వేగ నొక్క
గీతభావము నని పోదుఁ బ్రేతవీథి.

# భావకవి.

(భావమంజరి)

గరుడవాహన మెక్కెఁ గంజనాభుండు-
ఎత్తె వజ్రాయుధం బెలమి నింద్రుండు-
ఏనుఁగుతో ల్మ్రసుం గూనె శంభుండు-
ఖేదమోదము లొందె గిరిజాత మెండు-

(తద్భావము)

మును భూమీధరపంక్తి పక్షములతోఁ
భూభాగమం, దాకసం
బున నిచ్ఛారతి వాయువేగమున సం
పూర్ణప్రమోదంబుతోఁ
జనుచున్ స్థావరజంగమాదులకు స
శ్రాంతంబు సంఘర్షణం
బున సంక్షోభవినాశనాదిగతులన్
బుట్టించు టూహింపుమా.

# భావకవి.

కొండలకు ఱెక్క లెన్నండు నుండు నొక్కొ
యనుచు సంశయ మొందకు మట్లు గాక
యేల వజ్రాయుధము సృజియింపఁ బడియె?
వజ్రమును వజ్రమే కొట్ట వలయుఁ గాదె?

అనుపమపక్షగర్వమున
నద్రిసమూహము క్రిందుమీఁదులై
గనక వినాశదూత లయి
గ్రామములై, నరులై, మృగంబులన్
వనములఁ, బక్షులై సతముఁ
బా డొనరించుట కాక వ్యోమసీ
మను జని సర్వదా విబుధ
మార్గనిరోధ మొనర్చు నక్కటా!

అంబరంబున విహారంబు సల్పెడువిమా
నంబుల కడ్డు నిత్యంబుఁ దగిలి
తటినీతటాకాబ్ధితతిఁ దటాలునఁ బడి
వరదలై జల్లెల వరుస నూడ్చి

# భావకవి.

ప్రాసాదదివ్యదేవాలయపాళిపైఁ
బడి సజనముగ నవ్వానిఁ గూల్చి
దంతిగోగణసాధుజంతుసంతతులపైఁ
బడి హఠాత్తుగ వానిఁ బరిహరించి

స్వాదుఫలముల నిడువృక్షవాటిమీఁదఁ
దపము సలిపెడుమునిజనతతులమీఁదఁ
బడివినాశము సల్పునపక్షపర్వ
తములదుర్మార్గచర్యలు తలమె తెలుప?

ప్రళయసమయాన గ్రహములు క్రమము దప్పి
విశ్వసంక్షోభ మొనరించువిధము గాఁగఁ
బర్వతంబులు చెలరేఁగి ప్రతిదినంబుఁ
బ్రళయము న్గూర్చు భూనభోభాగములను.

కావున దివిజులుఁ భువిజను
లేవిధమున నైన నిమ్మహీధరబాధా
భావముఁ గోరుచు నేక
గ్రీవంబుగ మొఱలు వెట్టిరి సురేంద్రుకడన్.

## భావకవి.

తనయైరావతదంతి నెక్కి హరి య
త్యంతోగ్రరౌద్రార్భటిన్
జని తత్పర్వతపంక్తిపక్షముల రో
షస్ఫూర్తి వజ్రాయుధం
బున ఖండించుట యత్తఱిన్ బఱచి యం
భోరాశిలోఁ జొచ్చి భీ
తిని మైనాకుఁడు దాఁగి యుండుట జగ
ద్విఖ్యాతచారిత్రమే.

ఆకడలి వెడలి యపు డపు
డాకుల మొనరించుచుండె నవనిం బడి మై
నాకుఁడు ప్రాకృతచర్యల
నేకరణినిఁ బట్టుపడకయే యింద్రునకున్.

అలమైనాకునిపక్షపాతకృతి క
త్యంతంబు నయ్యింద్రుఁ డూ
హలపై నూహలు సల్పి వ్యర్థుఁ డయి స
ర్వాధారుఁ డౌశౌరియే

# భావకవి.

కలఁ డంచుఁ జని భక్తియుక్తి సలుపం
　　గాఁ బూనె సంప్రార్థనం
బులు, తత్ప్రార్థన లాలకించి హరి సం
　　పూర్ణానురాగంబునన్.

నీకుఁ గలుగు జవము నిండారఁ జూపు మం
చాడి శౌరి గరుడి నధివసించెఁ.
బ్రళయ వేగ మూని పఱచెను గరుడుండు
భూరజంబు నింగి ముట్టె నంత.

ఆరజఃపటలంబు జలాశయములఁ
బడుచు నింకింపఁ జేయ నవ్వార్ధి సైత
మింక మొదలిడె దానిలో నిమిడియుండు
వైరి మైనాకుఁ డంతట బయలుపడియె.
అది గదా సమయం బను చమరనాథుఁ
డెత్తి వజ్రాయుధంబుఁ బేరెలమితోడ
నఱకె మైనాకుఱెక్కలు, నాఁటనుండి
యద్రు లన్నియు నచలము లయ్యె భువిని.

## భావకవి.

గరుడపక్షప్రచాలనకారణమునఁ
దగురజోనిచయంబు మూర్ధస్థగంగ
నెంత కృశియింపఁ జేయునో యేమొ యనుచుఁ
బూనె నేనుఁగుతోల్మేలిముసుఁగు శివుఁడు.

అలగజాసురు వధియించునపుడు శంభుఁ
డాత్మరక్షోపయోగార్థ మతనిచర్మ
మూన వర మిచ్చినంమునఁ బూనెఁ, నాత్మ
రక్ష యగుఁ గాదె యర్ధాంగిరక్ష యనుచు.

మగఁడు బ్రదికియుండఁ దగెను నాసవత్రిక
ముసుఁ గటంచు గిరిజ మోద మొందె,
సోదరునకుఁ బక్షసూదన మాటయె
ఖేదకారణంబు గిరిజ కపుడు.

కవి సృష్టిం గలయద్భుతప్రకృతిశృం
గారంబు ప్రచ్ఛన్నమై
నివుడం జేయుఁ దమోవితాన మదె! కం
టే! మెల్ల మెల్లన్ జనున్,

భావకవి.

చెవి సోఁకున్ దొలికోడికూఁత యిఁక భూ
సీమన్ వసింపంగ రా
దవు రారా! మలికోఁడికూఁత విన రా
దాత్మీయలోకాశ్రితుల్.

మొదలగుశుక్లపక్షగరి
మోదయ మింతటి నుండి, యందు ని
న్ను దరియ వీలు లేదు, గమ
నోద్ధతిఁ గ్రమ్మరఁ గృష్ణపక్షమం
దుఁ దెరలి వచ్చి యాడెద మ
దూర్జితపద్యవినూత్నభావసం
పదలఁ గ్రమంబుగా, నిదె న
మస్కృతి నందుము పోయివచ్చెదన్.”



అల్లముక్కాలిపీటసాయమునఁ జేసి
యాంధ్రపైశాచిభాషలో నతఁడు వ్రాయు

## ఛావకవి.

దేశభాషాహితోక్తసందేశరూప
పంక్తులకుఁ దత్క్షణమె ఛాయ వ్రాసినాఁడ.

లేఁత తెనుంగుపాపనుఁ గు
    లీనను మంజులశయ్య నుంచి, సం
ప్రీతినిఁ బెంచి, పాకరస
    వృత్తుల రీతుల నీతులన్, గుణ
ఖ్యాతకళారహస్యముల
    నర్మిలి నేర్పి, యలంకృతిప్రభో
పేతగఁ బెద్దఁ జేసినక
    వీందుగ్రనిఁ దిక్కనయాజిఁ గొల్చెదన్.

# గణాధిపతి.

నీవు గణేశ్వరుండ వని
నీల్గకు మింకఁ గళానిధిప్రశాం
తావహదృష్టిమాత్రమునఁ
దావకకుక్షియె రెండు చెక్కలై
పోవుట లేదె? నీ వెదురు
వోవకు మీఁపయి నట్టివాని కో
దేవర! వానితీవ్రతర
దృష్టిని జీవనభంగ మౌఁ జుమా!

బళిరా! నీదగుపాండితీవిభవస
ర్వస్వమ్ము వమ్మయ్యె నీ
యిల నావ్యాసుఁడు వ్యాసఘట్టములు వ్రా
యింపంగ నానాఁడె, నీ
తలమీఁదన్ జనులేఖకుల్లలరు, పం
తా లేల గుజ్జింపురా
తులతో మూషికవాహనుండ వగు చెం
దుం బోవు లంబోదరా!

# గణాధిపతి.

ఆసుకళావిభూతి విబు
   ధావళి పెట్టినభిక్ష నీకు, నీ
వేసము కృత్రిమం, బదుకు
   వేసినబొంతను బోలుజీవితం
బీసున కిక్క వౌదు, వెఱ
   వే సుమ నీతలకాయ, యింక
నీ వేసరణిం గనంగ మొగ
   మెత్తుట కౌనె, మతంగజాననా !

జంటగఁ దోఁచి యొంటఁ దగు
   శబ్దము నర్థము నా నెసంగుము
క్కంటిని గౌరిఁ దత్పరతఁ
   గాంచఁగ నేగెడు భార్గవుండు నీ
తుంటరిచేఁతకుఁ గినిసి
   తోరపుదంతము నూడఁ గొట్టె గొ
డ్డంటను మున్ను, నీ విఁకను
   డంబముల న్విడు మేకదంతుఁడా !

# గణాధిపతి.

కాకనదంబునం దలయ
గస్త్యుఁడు క్రుంకిడి పోవుదారిలోఁ
గాకవి వై కమండలువుఁ
గాలను దన్నితి వంతెకాని య
క్కాకనదంబునే తనయ
ఖండకమండలువం దిమిడ్చి భూ
లోకవిహార మామునివ
రుం డొనరించుట నాఁపఁ గల్గితే?

అలశ్రీరంగనివిగ్రహంబుఁ గొని నీ
వానాఁ డిలం ద్రోసి పోఁ
గలుగన్ జాలితివా? విభీషణుఁడు గి
న్కన్ బొంది వెన్నాఁడి ని
న్బలిమిన్ బట్టుక కొట్టఁడా? "తిరుచినా
పల్లిన్" స్మృతిం దెచ్చుకో!
తలమీఁదం గలగాయమున్ దడుముకో!
దౌర్జన్యము న్మానుకో!

# గణాధిపతి

ప్రతిగేహంబును దూఱె దీవు, మహి నె
వ్వారైన నేదే నిడన్
గతుకన్ జూతువు, జాతిభేద మనులె
క్క న్జేయ వాభుక్తికై,
మిత మన్ సూక్తిఁ దలంప వింతయును నె
మ్మిన్ దిండిపోతా! నమ
స్కృతి నీ కింకఁ ద్వదీయభావ మిల ని
స్సీ! హేయమా నేటికిన్.

బహుభార్యల్ గలవాఁడ వీ వయిన నీ
ప్రాపంచికుల్ నిన్నుఁ బ్రి
త్యహమున్ బిల్తురు బ్రహ్మచారి వను చూ
హం జేసి నీయొద్దఁ ద
న్మహితోదంచితబుద్ధిసిద్ధిఁ గనమిన్,
సత్యం బగుం గాక, నిన్
బహుభార్యల్ గలబ్రహ్మచారి వని నే
భావింతు హేరంబుఁడా!

# గణాధిపతి.

వనధిన్ ద్రచ్చెడువేళ లక్ష్మి జనియిం
    పఁ దానిఁ బెం డ్లాడఁగా
మనముఁ జేసి, తదీయలబ్ధిఁ గలఁడై
    మానాథుఁ డున్నంత నా
యనతోఁ బో రొనరించి యోడితివి కా
    వా ? బ్రహ్మచారిత్వల
క్షణమా యియ్యది ? యే రెఱుంగరు భవ
    చ్చారిత్రసర్వాంశముల్ ?

ప్రతిభాశూన్యుఁడు, గర్వియుఁ, గలుషభా
    వప్రేరితాత్ముండు, దు
ర్మతి యానల్లగజాసురాభిధునిశీ
    ర్షం బొందుటం జేసి నీ
మతి కాలుష్యము నొందకుండు టెటులో ?
    మాన్యత్వ మె ట్లొందుటో ?
క్షితిసత్కార్యవితానవిఘ్నకృతి నీ
    చే నెట్లు గాకుండుటో ?

# గణాధిపతి.

చేతను గత్తి యుండుటనె
చెట్టునో, పుట్టనో కొట్ట బుద్ధి, త
దీ్రతిని విఘ్నసంతతి త్వ
దీయవశం బయి యుంటఁ జేసి సం
ప్రీతిని వానిసాయమున
విశ్వముఁ గాఁతియఁ బెట్టె దీవు, నీ
ఖ్యాతికిఁ గారణం బిదియె
కాదొకొ? విఘ్నవినాయకాంకుఁడా!

అర్థము నిచ్చు భూపతి ని
జాశ్రితపాళికి సంతతంబుఁ గా
వ్యార్థవిశేషము ల్గొలుపుఁ
బండితుఁ డాశ్రితజాతి కెందు, నీ
ప్రార్థనఁ జేయ విఘ్నములె
ప్రాప్తము సేతువు కాన సర్వదా
వ్యర్థము, వ్యర్థ మయ్యె! నినుఁ
బ్రార్థన సేయుట విఘ్ననాయకా!

# గణాధిపతి.

లోకక్షేమము లాభము న్నెనుచుని
ర్లోభుండ నే నంచు, ని
త్యాకాంక్ష న్బడి క్షేమలాభముఖసం
తానపరిమోదంబు, నీ
వే కైకొంటివి, వంచకుండ వయి హా
యిన్ మంటి విఘ్నేశ్వరా!
నీకాపట్యము తేటతెల్ల మిఁక దు
ర్నీతిన్ విసర్జింపుమా!

పనివడి పిండిబొమ్మ వని
పారిణము వోసియుఁ బెద్దఁ జేయ నీ
జననియు దేవతల్,—విబుధ
సంతతి సర్వము కన్న మిన్న వీ
వని మును మున్న పోయి పృథ
మార్చనగౌరవ మొందఁ జూతు వెం
దున జగతిన్ గృతఘ్నుఁడ! య
థోచితవర్తనమూను టొప్పదే?

# గణాధిపతి.

నినుఁ బూజించుట నీమహాగుణములన్
నీసత్కళాప్రాభవం
బును, నీమోమునుఁ జూచి కాదు సుమ యె
ప్డున్ నమ్ము నామాట నో
గణనాథా! భవదీయదుర్యశము, దు
ష్కార్యంబులం గాంచి ప్రా
ర్థనము న్జేతురు విఘ్నభీతిఁ గృతులన్
ధాత్రీజనుల్ పూజ్యుఁడా!

# OPINIONS

*M. R. Ry.* **Jayanti Ramaiah Pantulu garu.** B. A. B. L.

Telugu literature is not altogether wanting in the humourous element but in most of such poems the humour has taken the serious form of Personal sarcasm and is offensive. The humour of the present poems "in *Suklapaksham*" is mild and is directed not against persons but against certain new modes in Telugu poetry to which the rather inappropriate name "*Bhavakavitvam*" is generally applied. Their new poetry consists of fragmentary poems embodying stray ideas and is modelled somewhat after English lyrics. And being in many cases the production of amateur genius whose acqaintance with classical Telugu literature and command of Telugu language are meagre it ofen fails to express fully what the authors mean to convey. The poem "*Bhavaturangam*" which embodies a well known anecdote attributed to "*Krishnadevaraya*" and the poet "Tenali Ramalinga Kavi" may be taken to point to this defect. Their poetry sometimes puts on a veil of mysticism as if to cover poverty of thought. The little Poem "Bhavakavitvam" is perhaps meant to caricature this feature.

I confidently hope for longer poems in future from the pen of this talented author Mr. RAMALINGASWAMY.

PITHAPURAM,
24—6—31.

J. RAMAIAH

చ హా గా జ శ్రీ

రావుసాహేబ్ గిడుగు వేంకటరామమూర్తి పంతులుగారు

"శుక్లపక్షము" లోని కవితలు కొన్ని పత్రికలలో ప్రకటిత మయినప్పుడు చదివి చాలా సంతోషించినాను; "ఓహో! క్రొత్త తెలుగు కవిత ఆవిర్భవించినదే!" అని అనుకొన్నాను. ఇప్పుడు శ్రీ రామలింగస్వామి పంతులుగారు తమకవితలన్నీ చేర్చి ఒక్క పుస్తకముగా అచ్చువేయించినందున అవి అన్నీ చదువుటకు వీలయినది; చదివినందువల్ల నాఅభిప్రాయము దృఢపడ్డది. మొట్టమొదటి పద్యమునుండి చిట్టచివరిపద్యముదాకా నాలోనేను ఆనందిస్తూ కవియొక్క ఉక్తి విశేషములు మెచ్చుకొంటూ చదివినాను. హాస్యములో మోటుతనములేదు; మిక్కిలినాజూకుగా ఉన్నది పరిహాసము; స్త్రీలూ పురుషులూ, పిల్లలూ పెద్దలూ, పండితులూ పామరులూ, గ్రాంథికభాషా సంప్రదాయములు తెలిసినవారైతే స్వయం చదువుకొని కానీ చదివించి వినికానీ, సంతోషించవచ్చును.

సంస్కృతభాషలో రచించిన ప్రహసనాలుకొన్ని చదివి ఎరుగుదును. వాటిలోని హాస్యము మోటుగాను పచ్చిపచ్చిగాను నామట్టుకునాకు అసహ్యముగాను ఉన్నది. సంస్కృత కవితను అనుసరించిన తెలుగుకవితలోకూడా హాస్యము ఆలాగుననే ఉన్నది. అది కవుల దోషమనగూడదు. పూర్వకాలమందు ప్రభువుల చిత్తవృత్తికిన్ని ప్రజలరుచులకున్ను అనురోధముగా కవులు రచించినారు. ఏకాలమందైనా ఏదేశ

మందైనా ఈప్రకారము జరుగకతప్పదు. గ్రీసు, ఇటలీ ఫ్రాన్సు, ఇంగ్లండు మొదలయిన దేశములందున్న పూర్వ కాలపు కవితలలో మోటుహాస్యము కొంచెము ఎక్కువ తక్కు వగా కనబడకపోదు. నాటకాలలో నర్మసఖుడు విదూషకుడు రాజులతో చేసేసంభాషణ, భాగోతములో హాస్యగాడు కృష్ణ మూర్తితోను సత్యభామతోను ఆడే పరాచకాలు మన కాలములో అసహ్యామవుతూఉన్నవి ఇప్పటి రసికులరుచు లలో మార్పుకలిగినది. ఈమార్పును అనుసరించి కవితలోని హాస్యముకూడా మారుతున్నది. నాజూకుగా హాస్యరచన చేసే తెలుగుకవులలో శ్రీ అనంతపంతుల రామలింగస్వామి గారు అగ్రగణ్యులనుకొంటాను.

వీరి "హాస్యము" 'గ్రామ్య' భాషా సాహాయ్యము ను అపేక్షించలేదు. తమ కవితావిధానమునకు అనుకూలము గా గ్రాంధికాంధ్రభాష అలవర్చుకొన్నట్లు కనబడుతున్నది. శిష్టవ్యవహారస్థభాషలో నాజూకుగా, ఔచిత్యభంగము కాకుండా హాస్యము, భక్తి, వాత్సల్యము, మొదలయిన రసములన్నీ వ్యక్తపరచ వచ్చును. కవిగారు 'స్వభాషలో' కవిత రచించుటకు ప్రయత్నిస్తే నెగ్గకపోరు: అట్టి కవిత ఆబాల గోపాలము అందరికీ సుబోధముగాఉంటుంది; మోటుహాస్య ము అసహ్యామవుతుంది; ఉచితమైన హాస్యమందు అభిరుచి కలుగుతుంది.

పర్లాకిమిడి,
5—2—1932.

గి॥ వెం॥ రామమూర్తి.

బ్రహ్మశ్రీ

## కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు

"శుక్లపక్ష" మను నీఖండకావ్యము నేఁడు భావకవులమనుకొని యభావకవిత్వమును జెప్పువారిని బరిహసించును. లోకములో నిందార్హములగు కార్యములగునప్పు డిట్టిగ్రంథములుపుట్టుట స్వభావసిద్ధమే. ఆంధ్ర సారస్వతమున వ్యక్తుల నధిక్షేపించు గ్రంథములు లేకపోలేదు గాని యొకకవితాసంస్థను జమత్కారముగా నధిక్షేపించుచు విమర్శించునీ'శుక్లపక్షము'వంటి గ్రంథములు లేవని చెప్పవచ్చును. ఇట్టి కావ్యవిరచనకు శ్రీ రామలింగస్వామిగారు మార్గదర్శకులని నాయభిప్రాయము. ఇందలి వ్యాసములకు వీరుపెట్టిన పేళ్లు సమంజసములు. భావ కవిత్వవిషయమునఁ దమకుఁ దోచిన యభిప్రాయములను వీరు పరిపూర్ణముగా నీగ్రంథమునఁ జొప్పించిరి. పెక్కుస్థలముల నాయా భావముల నద్దమునఁ జూపినట్లుచూపిరి. ఇందుఁ బ్రతిపద్యము రసవత్తరముగా నున్నది. రామలింగస్వామిగారి కవిత్వము నాతి కఠినమృదుమధురశైలింబొందియుండునని నేనిటఁజెప్పుట విన్నదాని వినిపించుటయే. ఇప్పటివారిలోనిట్లు చర్చించి సారవంతములగు పద్యములు వ్రాయువా రరిది.

రాజమహేంద్రవరము, 1—1—1932. } శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.

బ్రహ్మశ్రీ
కింకవీంద్రఘటాపంచానన విద్వత్కవి, బాలకళానిధి, బాలసరస్వతి, శతావధాని, చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు.

శ్రీమత్పరదేవతాయైనమః

'శుక్లపక్షము' అను నీక్రొత్త పోకడగల పొత్తమును నేనామూలాగ్రము చదివియుఁ జదివించియు నిందలివిశేషాంశములను గ్రహించితిని- ఇది కేవలము నూతన సృష్టి. ఇట్లగుటకుంగతము వేఱొక నూతనసృష్టియే. అనఁగా నేమందురా- ఇప్పుడు కొలఁది కాలమునుండి కవిత్వమున నొకక్రొత్తపోకడ ప్రారంభమైనది. పలువురు యువకవు లాపోకడనే రచించుచున్నవారు. ఆరచనల భావమును గ్రహించుట సామాన్యులకేకాదు—పెద్దపెద్ద వ్యాఖ్యాతలకును దురవగాహముగనేయున్నది. ఇంతియకాదు.

"జీవతః కవేః ప్రష్టవ్యమ్"

అనియెంచి గ్రంథకర్తయొద్దకరిగి దీనిభావమేమన—'నాకేమి తెలియును నీవేచూచుకొ'మ్మనుటగూడ ననుభూతమగుటచే నీకవిత్వమేల యుదయించుచున్నదో చెప్పవీలులేకున్నయది. దీని ననేకులు— "భావకవిత్వము" నావినియుంటిని. కాని యీపేరిద్దాని కెంతవఱకుచితమో నిర్ణయింపఁజాలను. మొత్తమిట్టిరచనకుఁగారణము వంగభాషాకవులరచనయనిపలువురనగా

వింటిని. వంగభాషాకవులకు మార్గదర్శకము హూణభాషా రచనయనియును విందును. ఏమైననేమి, పై రెండు భాషల యందును గల రచనయందలి విశేషమును గ్రహించుశక్తినాకు లేకున్నను, తత్తద్భాషా నిష్ణాతుల యానందమును బట్టి—

"ఆప్తవాక్యం ప్రమాణమ్"

అనుటచే నవి యట్టివియని విశ్వసించియు, నీభాష యం దంతో యింతో ప్రవేశముండియుఁ గొంచెమేని యానందము గలుగకుంటచే నీ 'భావకవిత్వమును' గవనముగా విశ్వసింపఁజాలని వారిలో నే నొకఁడ నైతిని. నా భావమున కనుగుణముగా నీ రామలింగస్వామిగారు యువకవులయ్యుఁ బూర్వకవుల యాచారము ననుకరించి యొకవ్యక్తికి మనసు నొచ్చు పోకడలుపోక కేవల భాషావిషయమును మనమం దుంచికొని దీనిని రచించి తమయభిప్రాయమును వెల్లడించిరి. ఇట్టికావ్యము లింతవఱకు మనభాషయందు లేని లోటును దీర్చిన పరిష్కృతగ్రంథకర్త శ్లాఘ్యుఁడే కాక శ్లాఘ్యతముఁడు గూడ నని నాయభిప్రాయము.

కడియము
తూ॥ గో॥ జిల్లా.
తే 24—2—1932 ది.

చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి,
శతావధాని.

*M. R. Ry.*

**V. Ch. Sita Ramaswamy Sastri Garu**
Junior Lecturer in Telugu,
*Oriental Research Institute,*
*Madras University.*

ఆర్యవర్యా !

మీరచించిన 'శుక్లపక్షమును' జదివి యానందించితిని. అందలి కవిత ధారావాహియై మృదుమధురరచనాకలితమగుచు నూతనఫక్కిని విలసిల్లుచున్నది. భావకవితలనఁబడుచు నేఁడు బయలువెడలుచున్న ఖండకావ్యములలో ననేకము లభిప్రాయావేదక శబ్దసామగ్రి పూర్ణములుకాక యర్థవ్యక్తిగుణభూషితములు కాకున్నమాట నిజమే. అట్టివానిఁ జక్కఁజేయుట కిట్టివిమర్శనము లావశ్యకములే. విమర్శనము వాఙ్మయమహోదయమునకుఁ బ్రధానమగుటచే మీ విమర్శనమాంధ్రవాఙ్మయాభివృద్ధికి మిక్కిలి యుపకారకమని నాయభిప్రాయము.

ప్రాచీనాంధ్ర మహాకవులు కుకవినిందారూపమున నేతాదృశ విమర్శనచ్ఛాయను జూపియున్నను వానియం దిట్టి మార్దవసారస్య వైశాల్యములు లేమింజేసి మీ శుక్లపక్షము పూర్వసద్విమర్శనగ్రంథమని చెప్పుటకు సందేహము లేదు.

మదరాసు,
27_3_1932.

వఝల చినసీతారామస్వామి శాస్త్రి.

*M. R. Ry.*

**PINGALI LAKSHMI KANTAM GARU**, M. A.,
Lecturer *Andhra University*.

ఇప్పటి కవిత్వమునకు "భావకవిత్వము" అని యే మహానుభావుఁ డేదుర్ముహూర్తమున నామకరణము చేసెనో కాని, నాఁటినుండియు నిది బహుజనదూషణకుఁ బాత్రమై నవయుచున్నదనుట స్పష్టము. పేరుమాట యటుంచి, యీ కవిత్వము నిజముగా, నంతదుష్టమా, యిందేదియు గుణములేనేలేదా యను విషయమును, సహృదయుఁడెవఁడేని, నిష్పాక్షికబుద్ధితో విచారించి తేల్చవలసియున్నది. భావకవులలోఁగూడ గొందఱు సరసముగ వ్రాయువారు లేకపో లేదని పల్వుర యభిప్రాయము. ఈ మాటను శ్రీరామలింగ స్వామిగారును గాదనరు.

ప్రికృతకావ్యము. భావకవులలో దంభజాతిని గూర్చి ప్రయోగించిన పరిహాసోక్తి. ఆజాతిలక్షణములలో ముఖ్యమైనవి 'పాండిత్యలోపము' "నియమోల్లంఘనము' 'ప్రాచీనకవిదూషణ' 'అన్యభావచౌర్యము' 'ఆత్మవంచనము' లోనగనవి. ఈ దుర్లక్షణములు గల కవులను నిదివరకే పండితులు పల్వురు పలువిధములఁ దెగడు చుండిరి. కాని యా పండితుల విమర్శలు కేవలము తిట్టులబుంగలగుట సరసములుగావు.

ఇఁక శ్రీరామలింగస్వామిగారి 'శుక్లపక్షము' కావ్యమర్యాదల పాటించిన విమర్శగ్రంథము. ఇది, వినువారి

వెగటుగొల్పని సరసమైన హేళనకావ్యము. ఇందు లక్ష్య భూతుఁడగు దంభభావకవి కూడఁ దనవర్ణనను జూచి నవ్వ వలసినవాఁడే గాని, కినియవలసినవాఁడు కాఁడు. దురాచారముల సంస్కరించుటకు నీప్రక్రియకుఁజాలిన, యమోఘాస్త్ర మింకొకటి లేదు.

ఇట్టి కావ్యములు, మనభాషలో నంతగాలేవు. విషయమునకుఁదోడు వస్తువున నూత్నత్వము గూడ నున్నది గనుక నీ కావ్యము లోకాదరము వడయు ననుటకు సందియములేదు.

విశాఖపట్టణము
తే 27—1—32 ది.

పింగళి లక్ష్మీకాంతం.

**M. R. Ry.. Dr. B. Seshagiri Rao Garu, M. A., Ph. D.**
"Andhra Bharati Theertha Pradhani,"
Lecturer. Maharajah's College,
*Vizianagram City.*

'శుక్లపక్షము' అను నీకృతిలోని కవిత్వం వంటిది. ఇది వరలో ఆంధ్రములో లేదు. అక్కడక్కడ పూర్వాంధ్ర కవులచరిత్రలలో వికటకవిత్వములూ వేళాకోళపు కవిత్వములూ కనబడతవి. కాని ఖండకావ్యములుగానో పద్యగుచ్ఛములుగానో ఒక అభిప్రాయమునుగాని వ్యక్తినిగాని నడతనుగాని వేళాకోళముచేసే కవితలు లేవనియే చెప్పవచ్చును.

వేళాకోళపు ఖండకావ్యములు చెప్పడమనేది ఆంగ్లసాహిత్యమును చదివి ఆనందించి అనుకరించినపద్ధతి. ఈకృతిలోని వేళాకోళపు కవిత్వమంతా "భావకవిత్వ"మనే నూతనాంధ్రరచనల నుద్దేశించి యున్నది. ఈవేళాకోళములో వ్యక్తిదూషణగాని, నిరసనగాని, వ్యక్తులయెడల ఆగ్రహముగాని ధిక్కారముగాని లేదనవచ్చును. రసభావభాసురమై నిరర్గళధారాశోభితమై బహువిధశిల్పవిశేషవిలసితమైన యాంధ్రకవిత్వమును కాదని బయలుదేరిన భావకవిత్వమునే యిందలి పద్యములు హాస్యరసప్రధానముగా పరామర్శించుచున్నవి. కాని నవీనాంధ్రకవిత్వము నవీనము గనుకనే నికృష్టమనుటలేదు. ఆంగ్లమందలి వేళాకోళపు కవిత్వములతో

పోల్చిచూస్తే ఇందలి వేళాకోళము సరసమై లలితమై నాగరకమైయున్నదనియే చెప్పగలను.

తెనాలి రామకృష్ణకవి ఆంధ్రములో వేళాకోళమునకు ప్రసిద్ధపురుషుడు. రాయలవారి సంస్థానములో ప్రకటకవి. ఆయనను గురువుగా పూజించి చెప్పిన కవిత్వము గనుకనే దీనిలో నీ గుణవిశేషములు కనబడుచున్నవి. మార్గము మంచిది. హృదయము మంచిది. రచనాచాతుర్యమున్నది. కృతిహృద్యమైనదనుట కింకేమికావాలి? ఈయువకవికి నా హృదయపూర్వ కాశీర్వచనములు.

విజయనగరం, 27_1_22.

బుర్రా శేషగిరిరావు,
ఆంధ్రభారతీ తీర్థప్రధాని.

---

**M. R. Ry., Gidugu Venkata Sithapathi Garu B. A. L. T.,**
Research Fellow Andhra University.

శ్రీయుత అనంతపంతుల రామలింగస్వామి పంతులు గారు రచించిన "శుక్లపక్ష" మను కావ్యమును చదివి మిక్కిలి ఆనందించినాను. దీనిలో గల భావములు, రచన, శైలి, ఆంధ్రసారస్వతమునకు అపూర్వమైనవి. రసహీనమైన భావ కవిత్వమును, భావకవుల శుష్కాడంబరమును వివరించివర్ణించు టలోను, సరసముగా నిరసించుటలోను కవిగారు అద్భుతమైన చమత్కారమును ప్రదర్శించినారు.

ఆంధ్రసారస్వతమునందు సరసపరిహాస కావ్యనిర్మాణమునకు వీరే మార్గదర్శకులని చెప్పవచ్చును. అంతేకాక కవి తనకాలపు ఆదర్శములను మనోభావములను లోకమున ప్రతిఫలింప జేయగల కావ్యమును రచించినప్పుడే అతని కావ్యము సారస్వతమందొక విశిష్టమైన స్థానమును ఆక్రమించి కలకాలము ఆనందదాయకముకాగలదు. వీరి "శుక్లపక్ష" కావ్యము అట్టికావ్యమని చెప్పవచ్చును. ఇందలి పద్యములలోగల పరిహాసవాక్యములు ఆయావ్యక్తులను సూచించుటచేత సమకాలమువారికిని, కావ్యపరిణామమును సూచించుటచేత భావికాలమువారికిని మనోహరములుగా ఉండగలవు. వ్యక్తిదూషణలేకుండా తప్పుత్రోవను బోవువారిని సరియైన మార్గమునకు రప్పింపగలనేర్పు కవిగారు తమకవితాకల్పనలోనే సరసముగా ప్రదర్శించినారు. భావగాంభీర్యమునకు అనుగుణములగు పదములను సమకూర్చుటలో వీరికి అద్భుతమైన శక్తిగలదు. ఆంధ్రలోకము వీరిని, వీరికవిత్వమును హెచ్చరించి ఆదరించునుగాక!

విశాఖపట్నం, 26_1_32

గిడుగు వెంకట సీతాపతి,
రిసెర్చిఫెలో, ఆంధ్రయూనివెర్సిటీ.

— —